# ప్రతిజ్ఞా యౌగంధరాయణం

(భాసనాటకం)



కాటూరి వేంకటేశ్వరరావు

వెల రూపాయి

ప్రతులకు :—

[illegible]

డాక్టరు గూడూరి నమశ్శివాయ

గాంధినగరం

బెజవాడ

కృష్ణా స్వదేశీ ప్రెస్సు, మచిలీపట్ణాం

ముద్రితము

అక్టోబరు 1945

200 ప్రతులు.

# *విన్నపం*

భాసనాటకాలన్నీ, పూర్వులైన చిలకమర్తి పంతులు గారొక్కొక్కటే తెలిగించారు. స్వప్న నాటకాన్ని మిత్రులు దివాకర్ల వేంకటావధానిగారు కూడ తెలిగించారు. అయినా నేను ప్రతిజ్ఞను, స్వప్న నాటకాన్ని మళ్లీ తెలుగు చేయడానికి కారణం- శ్రీ ఏ. యస్. పి అయ్యరు, ఎం.ఏ., ఐ. సి. యస్., బారిస్టర్, వీటి ఆంగ్లములో అనువదించి, నాయందలి ప్రీతికొద్దీ నన్నుగూడా తెలిగించమని ప్రోత్సహించుటయే.

మూలమునందలి కొన్ని శ్లోకాలు వచనంలోకి మార్చాను. వచన రచనలో శిష్టవ్యవహారాన్ని అనుసరించాను. అనేకచోట్ల అయ్యరుగారి భాషాంతరీకరణం నాకు మిక్కిలి తోడ్పడింది.

అయ్యరుగారు భాసకవినిగూర్చి ఉద్గ్రంథమొకటి రచించిరి. స్వప్న నాటకం ముద్రించునప్పుడు ఆ గ్రంథమునందలి విశేషాలు చేర్చుకుంటాను.

గ్రంథకర్త.

# ప్రతిజ్ఞాయౌగంధరాయణం



(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశం)

సూత్ర : వత్సరాజాఖ్యుఁ, డతివీర్యవంతుఁడరిభ
యంకరుండు, యౌగంధరాయణుఁడు, శక్తి
ధరుఁడునైన మహాసేనుఁ డరసి సిరుల
నొసఁగు వాసవదత్తాభయుండు మీకు.

(పరిక్రమించి, నేపథ్యంవంక జూచి)

ఆర్యురాలా! ఒకసారి యిలా వస్తావా?

నటి : (ప్రవేశిస్తూ) ఇదిగో వచ్చానండి.

సూత్ర : ఏదైనా పాటబాడి రంగప్రసాధనం
చెయ్యాలి నువ్వు. ఇంతలో మేమూ
ప్రకరణ మారంభిస్తాము. ఏమిటి! పాడ
కుండా ఏదో ఆలోచిస్తున్నావు?

నటి : మరేమీ లేదు. ఇవ్వాళ్ల మా చుట్టాలకు
అస్వాస్థ్యంగా వున్నట్లు కలవచ్చిందండీ.
అక్కడి కెవరినైనా పంపి కుశలవార్త
తెప్పిస్తారేమో మీ రని.

సూత్ర : అలాగే, దానికేమి! మనమేలు కోరే
 వాణ్ణీ, సమర్థుణ్ణీగా చూచి ఎవరినైనా
 పంపుతా నిప్పుడే.

( తెరలో )

సాలకా! ప్రయాణ మైనావటోయి ?

సూత్ర : అదిగో! యౌగంధరాయణులుకూడా
 మనిషిని పంపుతున్నారు. (నిష్క్రమింతురు)

ఇది స్థాపన

(సాలకునితో యౌగంధరాయణుడు ప్రవేశించును)

యౌగం : సాలకా! ప్రయాణమైనావా ?

సాల : చిత్తం.

యౌగం: చాలాదూరంవెళ్ళవలసివుందిసుమా.

సాల : దేవరసేవయందు నాస్నేహ మెంత
 దూరమైనా వెళ్లుతుంది.

యౌగం: ఔను స్నేహాపేరితమైన బలం ఎంత
 కయినా చాలివుంటుంది. కనుకనే,
 మాన్యగుణులౌండె, స్నేహసమ్మాన్యులౌండె
 పూన్పందగుదురు దుష్కరమ్ములగు పనులు,
 అవల దైవానుకూల్యమ్ము నమరునేని
 కార్యము ఫలించు, లేకున్న గాసిచెందు.

అన్నారు. ఏలినవారు రేపు వేణువనంనుంచి బయలుదేరుతారు. అక్కడినుంచి మూడు కారడవులు దాటి పోవాలి నాగవనానికి. ఈ లోపలనే నువ్వు అందుకోవాలి ఏలినవారిని.

సాల: చిత్తం. లేఖకూడా ఒకటి ఇప్పిస్తారు గనుక కార్యవివర మంతా అదే చెపుతుంది.

యౌగం: అవును. విజయా!

విజయ: (ప్రవేశించి) ఇదిగో! వచ్చానయ్యగారూ!

యౌగం: ఏవీ, ఆ లేఖా, రక్షాబంధ నమూ ఇంకా సిద్ధంకాలేదూ?

విజయ: చిత్తం. (నిష్క్రమించును.)

యౌగం: సాలకా! ఈ [illegible] నువ్వీదారి?

సాలక: ఎటుకక్కపోయినా వింటూవున్నదే లెండి.

యౌగం: అదీ బుద్ధిమంతుని లక్షణమంటే. మంచిది. ఏలినవారిని [illegible] పట్ట

వలెనని ప్రద్యోతుల యత్నం. ఇందుకు
గాను నీలగజము నొకదాన్ని పన్ని, గుర్తు
తెలియకుండా అడవియేనుగులమధ్య నిలిపి
పెట్టారని మాకు సమాచారం తెలిసింది.
ఏలినవా రాపన్నుగడలో బహుశః పడం
గూడదు. ఔరా! ప్రద్యోతులవారి
కెంత భయమో వత్సరాజంటే! వారి
కెన్ని అక్షౌహిణు లున్నా యిందుకు పనికి
రాలేదని తేలింది.

కలవు బలములు, లే దేకకార్యయుక్తి,
వీరు లున్నార లనురక్తి దూరు, లింక
సమరమే లని వూనె వంచనము వైరి;
రక్తి లేని ఆలియు, సేన రట్టుకొఅకె.

విజయ: (ప్రవేశించి) ఇదిగో! లేఖ తీసుక
వచ్చా నయ్యగారూ! రక్షాబంధనం
ముత్తైదువ లంతా త్వరగా కట్టియిస్తారని
రాజమాత సెలవిచ్చారు.

యౌగం: విజయా! అమ్మగారితో మనవి
చెయ్యి, ముత్తైదువ లందఱూ కాకపోతే

మానె, ఒక్కరిచేతనైనా త్వరగా కట్టించి పంపండని.

విజయ : చిత్తము. (నిష్క్రమించును.)

(నిర్మండకుడు ప్రవేశించును.)

నిర్మం : దేవరకు శుభం!

యౌగం : ఏమి నిర్మండకా?

నిర్మ : ఏలినవారి పాదసన్నిధినుండి హంసకుడు వచ్చాడండి.

యౌగం : హంసకుఁ డొక్కఁడే తిరిగిరావడమేమిటి! సాలకా నువ్వు వెళ్ళి కొంచెం విశ్రమించు. నీ ప్రయాణం మొదలే మానటమో, వెళ్లవలసివుంటే అతిశీఘ్రంగా వెళ్ళటమో, ఏమవుతుందో!

సాల : చిత్తం. (నిష్క్రమించును)

యౌగం: నిర్మండకా! హంసకుణ్ణి ప్రవేశపెట్టు

నిర్మం : చిత్తం. (నిష్క్రమించును)

యౌగం : ఏలినవారిని మున్నెన్నఁడూ విడిచివున్నవాఁడు కాఁడు, హంసకుఁ డొక్కఁడే

రావటంవల్ల మనసు కళవళపడుతున్నది.
ఇంటివద్ద బంధువుకు జబ్బుగా వుండఁగా,
అన్యదేశానికి వెళ్లివచ్చినవానిమనస్సు,
ప్రియమో అప్రియమో, ఏమి వింటానో
అని యిలాగే కళవళపడుతుంది.

(హంసకనిర్మండకులు ప్రవేశం)

నిర్మం: ఇటు, ఇటు.

హంస: ఎక్కడెక్కడ! అమాత్యులవారు.

(సమీపించి) కుశలమా అయ్యగారికి?

యౌగం: హంసకా! ఏలినవారింకా నాగ
వనానికి వెళ్లలేదుగద?

హంస: నిన్ననే విజయంచేసారండి.

యౌగం: అయితే యిఁక మనవిని పంపనక్కఱ
లేదు. ఔరౌర! ఎంత మోసపోయి
నాము! హంసకా! ఇంకా ఏమైనా ఆశ
వున్నదా? లేక ఇంతటితో మన మందఱం
ప్రాణాలు వదలవచ్చునా?

హంస: ఏలినవారు జీవించేవున్నారండి.

యౌగం: జీవించేవున్నారా! అయితే కొద్ది
 వివర్తేదో మూడిం దన్నమాట. పట్టుబడ
 లేదుగద ప్రభువు?

హంస: చిత్తం. తమ రూహించినట్లే, పట్టుబడ్డా
 రేలినవారు.

యౌగం: ఆఁ! పట్టుబడ్డారుగా నాప్రభువు!
 ఎంత అదృష్టవంతుఁడు ప్రద్యోతుఁడు!
 ఎంతపని చేసాడు! వత్సరాజమంత్రిల
 అసమర్థతా, అపకీర్తి నేటితో స్థిరపడిపోయి
 నవి. హంసకా! అనుత్పన్నకార్యవండి
 తుఁడు, ఋమణ్వంతుఁ డేమైపోయినా
 డురా? అశ్వదళ మంతా ఏమయిందిరా?

కులము గుణమ్ము గల్గి రణకోవిదులై
 కదుఁగూర్చు రావుతుల్
బలసిచనన్, నృపాలకునిఁ బట్టగ నేర్చునె
 దాయ? ద్రోహమ్ముఁ
దలఁచిరొ? దుర్గమాటవులదారు లెఱుంగక
 తప్పిపోయిరో?
పలువురుమార్తురం గెడపి ప్రాణము
 లొడ్డిరొ సంగరమ్మునన్?

హంస : సమస్తరోధపరివేష్టితులై వున్నట్టే అయితే ఏలినవారి కీవిపత్తు రాకనేపోవును.

యౌగం : మఱి, కొంత పరివారాన్ని వదలి వుండట మెందువల్ల ?

హంస : మనవిచేస్తాను, సవిస్తరంగా.

యౌగం : అలసివచ్చావు, కూర్చుండి చెప్పు.

హంస : చిత్తం. (కూర్చుండి) నిన్న వేగుజా మున ఇంకా కవరకపర చీకటి వుండఁగానే సుఖప్రయాణయోగ్యమైన చల్లబాటువేళ ఏలినవారు బయలుదేరారు. నర్మదా నదిని ఇసుకరేవున దాఁటి, రాణివాసాన్ని వేణువనమందే నిలిపి, ఛత్రింపట్టే పరిజ నాన్నీ, ఏనుగువేటర్లనూ మాత్రం వెంటఁ బెట్టుకొని, ఇరుకుదారులవెంట నాగవనం లో జొరబడ్డారు.

యౌగం : అలా చెప్పు ! తరువాత ?

హంస : అమ్మవేటు పొద్దు ఎక్కేసరి కప్పు డే చాలాదూరం గడచివెళ్ళాము. మద గంధిరపర్వత మింకో కోసె డుంటుందనగా,

అక్కడ నో బురదగుంటలోనుంచి లేచిన గజయూథం, ఎగుడుదిగుడుగా కట్టివిడిచిన గోడవలె కనిపించింది.

యౌగం: ఆ పిమ్మట ?

హంస: అక్కడ నిలిచి పరకాయిస్తున్న మన పరివారాన్ని చూచి, గజయూథం శంకిస్తూ గుంపులుగూడుతూ వుంది. ఇంతలో ఈ యనర్థాని కంతటికీ మూలకారణమైన బంటో౽కడు ఏలినవారి చెంతకు వెళ్ళి,-

యౌగం: ఆగు ఆగు. "ఇక్కడికి కోసెడు దూరాన మల్లెపొదల్లో ఒక ఏనుగును చూచాను. దంతాలూ గోళ్లూ తప్పితే, దాని ఒళ్లంతా నీలమయంగా వుం" దని చెప్పాడు వాడు; అంతేగా ?

హంస: అప్పుడే యెలా తెలిసిందీ, దేవర కీ వృత్తాంతం! అయితే దేవరవారు కను పెట్టేవున్నా రీ ప్రమాదాన్ని.

యౌగం: ఎంత కనుపెట్టివున్నా విధి బలవత్తర మయిపోయిందిరా హంసకా!

హంస: ఏలినవా రానరహంతకుడికి నూరు సువర్ణాలు బహుమానమిచ్చి, సెలవిచ్చారుగదా, "మేము గజశాస్త్రంలో పఠించాము, నీలకువలయతనువైన గజచక్రవర్తి వుంటుందని. అదే యిది కావలెను. మీ రంతా యీ గజయూధాన్ని కనిపెట్టి వుండండి. మేము వీణాద్వితీయులమై వెళ్ళి ఆ యేనుగును పట్టితెస్తాము" అంటూ బయలుదేరారు.

యౌగం: ఋమణ్వంతుడు చూస్తూ వూరకొన్నాడా, ఏలినవా రొంటరిగా వెళ్లుతూ వుంటే?

హంస: లేదండి, వూరకోలేదు. అనేకవిధాల మనవిచేసా రమాత్యులు. "ఈ యేనుగే కాదు, ఐరావణాదులు కూడా ఏలినవారికి సులభమే పట్టుకోవడం. కాని యీ సరిహద్దుభూములు సుపరిపాలితములు కాకపోవడంచేత సిగ్గుమాలిన అలగాజనం చరిస్తూవుంటుం దిక్కడ. కనుక ఏలినవా రొంటరిగా విజయంచేయడంకంటె,

పదాతుల నిచట కాపలా వుంచి మన మంతా వెళ్లడం మంచి" దంటూ బహు దూరం మనవిచేసారు.

యౌగం: మేలు మేలు! మహాజనసమక్షంలో ప్రభువు కిలా మనవిచేసిన బ్రాహ్మణ్యంతునిదే భాగ్యమంటే. నా స్వామిభక్తి అమాత్యా నికి గూడా నోచుకోలేదు. తరువాత?

హంస: ఏలినవా రప్పుడు తమమీద ఒట్టు పెట్టుకొని అమాత్యులను నివారించారు. నీలవలాహకహస్తినుండి దిగి, సుందరపా టల మనే గుఱ్ఱా న్నెక్కి ఇరవైమంది పదా తులను మాత్రం వెంటదీసుకొని, ఇంకా ప్రొద్దు నెత్తిమీదికి రాకమునుపే బయలు దేరి వెళ్లారు.

యౌగం: విజయోస్తు— ఆరోగ్యా! గడచిన వృత్తాంత మని మఱచాను స్నేహంకొద్దీ. తరువాత తరువాత?

హంస: అనుకొన్నదూరానికి కొంచెంతలు వెళ్లిన తరువాత నూఱువిండ్లదవ్వున ఆ కపట దేవతాగజం కనిపించింది. సాలవృక్ష

ముల నీడ నుండటంవల్ల దాని నీలశరీరం కనిపించక, వట్టి బయలున పొడుచుకుని వచ్చినట్లున్న దంతాలు మాత్రం కని పించినవి.

యౌగం : హంసకా ! ఏనుగు కాదురా, మన విపత్తే కనిపించిం దను. తరువాత ?

హంస : ఏలినవా రంతట గుఱ్ఱాన్ని దిగి, దేవత లకు ప్రణామంచేసి వీణను చేతఃబట్టారు. ఇంతలో వెనుక దిక్కునుండి ఏదో కంఠధ్వని పెడబొబ్బవలె వినిపించింది.

యౌగం : కంఠధ్వనే ! తరువాత తరువాత?

హంస : అప్పుడా ధ్వని యేమిటో అని మే మంతా అటు తిరిగి చూస్తూవుండగా, సాయుధులైన యోధులను మూపున దాల్చి ఆ మాయయేనుగు వెనుకనుంచి మామీాద వచ్చిపడింది.

యౌగం : అంతట ?

హంస : ఏలినవా రప్పుడు చుట్టునున్న కుల పుత్రులను ఒక్కొక్కరినే గోత్రనామా లతో పిలుస్తూ " రండి ! ఇది ప్రద్యోతుని మోసం. మావెంట రండి. మన పౌర

పాటువల్ల శత్రువు ఆక్రమించి రాఁగలి
గాడు. ఇదిగో, మాపరాక్రమంచేత సర్వ
మూ చక్కబరుస్తాము" అంటూ పర
బలంలోఁ జొఱబడ్డారు.

యాగం: చొఱఁబడడమే! అవును.
పగరు వంచించి, తలమీఱి వచ్చినపుడు
మగటిమి దలిర్ప బల్మియుఁ దెగువచూపఁ
దివురుటయకాక వేఱొండు తెన్నుగలదె
మానధనులైన బలుపోటుమానిసులకు?
ఆమీఁదట?

హంస: ఆమీఁదట తమ మనస్సు వెంటనే
చరించే సుందరపాటలాన్ని చిత్రగతుల
చరింపజేస్తూ, ఏలినవారు పరబలాన్ని
చించి చెండాడుతూ తనివితీఱని సంగర
క్రీడ చేసారు. ఇలా ఎంత చెండాడినా
పరబలం తఱగలేదు. ప్రభు వంతకంతకూ
డస్సిపోతున్నారు. రిచ్చపాటుగదిరిన మన
బల మంతా నష్టపడిపోయింది. ఇక మిగి
లింది నే నొక్కడను బాసటగా—అయ్యో
నే నేమి బాసటవుతాను! నన్నూ వారే

రక్షింపవలసివచ్చె, గుఱ్ఱమేమో గాయాలు తిని పడిపోయింది. అంతకంతకు అధిక మయ్యే సంగరపరిశ్రాంతినీ, ఎండవేడినీ సహించలేక మూర్ఛపోయినా రేలిన వారు.

యుగం: ఆఁ! ఏమన్నావు? మూర్ఛయే! పిమ్మట?

హంస: అలా మూర్ఛపోయిన ప్రభువును, చేరువ అడవిలో చేతికందిన కలికితీవ లేవో పెఱికి తెచ్చి, మోటువాణ్ణి కట్టి నట్లుగా కట్టిపడవేసారు శతృవులు.

యుగం: ఏమి! కట్టివేసిరా ప్రభువును?

తూలిన మిత్రులఁ బ్రియముతో
నెదఁ జేరిచి, విప్రకోటికిఁ
జాల సపర్యలఁ సలిపి, జ్యాకిణ
కర్కశపాణియై, రణా
స్ఫాలితచాపమై, ఎగుబుజమ్ములతో
గజతుండముల్ బలెన్
వ్రేలుచుఁ గంకణమ్ములు ధరించు
కరద్వయి రజ్జుబంధమా!

పిమ్మట ఎంతసేపటికి తెలివివచ్చిందిరా, ఏలినవారికి ?

హంస : శత్రువులనోటితీట తీరినతరువాతనే తెప్పిరిల్లారు.

యాగం : నయమే, శరీరానికే బాధకలిగింది గాని తేజం తిరస్కృతంకాలేదు. తరువాత నేమైనది ?

హంస : ఏలినవారికి ప్రాణాలు తెప్పిరిల్లడం చూచి ఆ పాపులు "అదిగో లేచాడురా నా అన్నను జంపినవాడు! నాతమ్ముణ్ణి వీని పొట్టనే పెట్టినామురా ! నా కొడుకును మ్రింగిన దీతడేరా !" అంటూ స్వామి పరాక్రమాన్ని భయకంపితులై చెప్పు కొంటూ నలుదెసలకూ పరుగెత్తారు.

యాగం : తరువాత తరువాత !

హంస : ఏమి చెప్పను ? తరువాత నొకవింత జరిగింది. ఆ పాపకర్ము లొకరినొకరు హెచ్చరించుకొన్నమీదట వారిలో ఒక డు అకార్యానికి తెగించాడు. యుద్ధ పరి

శ్రమించే చిక్కి జీరువడిన ఏలినవారి కేశములను బట్టి పడలాగుతూ దక్షిణముఖంగా త్రిప్పాడు. పిమ్మట విసురు తెచ్చుకోడానికి వెనక్కి పరుగెత్తి, కత్తి చేయెత్తి, ఒక్క ఉదుటున ముందుకు—

యౌగం; ఆగు, చెప్పకుగాని; నన్ను కొంచె మూర్చ్చచ్చుకోనీ.

హంస: అలా చంపవచ్చే రాక్షసుడు, నెత్తుటి వట్టోడిన బురదనేలపై వేగవశాన కాలు జారి పడి తానే మరణించాడు.

యౌగం: చచ్చెఁగదా పాపి! ఆహా!
పరబలములచేతఁ బడకుండ రక్షించి
ధర్మసంకరమ్ము దప్పఁద్రోచి
ఇన్నినాళ్ళు దన్ను నేలినభర్తను
బ్రోచికొనియె నేడు భూమిదేవి!

హంస: ఏలినవారి కుంతప్రహారం తిని, ఇంత సేపూ సొమ్మసిల్లి పడివున్న సాలంకాయను లనే ప్రద్యోతామాత్యులు, ఒడలు తెలిసి "వద్దువద్దు, సాహసం చేయకండి" అంటూ లేచివచ్చారు.

యౌగం: ఆఁ! తరువాత నేమి జరిగింది?

హంస: ఆస్థితిలో వున్న ఏలినవారికి దుర్లభ
మైన పరిణామంచేసి ఆ మంత్రి ఏలిన
వారిని బంధనములనుండి విడిపించారు.

యౌగం: విడివడ్డారుగదా ప్రభువు, బంధన
ములనుండి. మేలు, సాలంకాయనా!
మేలు. అవస్థను బట్టి శత్రులుకూడా మిత్రు
లవుతారుగదా! హంసకా! ఇప్పటికి కొం
చెం కుదుటబడింది నామనస్సు. చెప్పవు?
తరువాత నేమిచేసా డా సాధువు?

హంస: పిమ్మట నా అయ్యగా రెంతో నొచ్చు
కొంటూ ఏలినవారిని శాంతపరచి,
గాయాలవల్ల వాహనపుఁగుదువు భరించలే
రని చెప్పి ఏలినవారిని డోలీపై ఎక్కించి,
ఉజ్జయినికిఁ గొంపోయినారు.

యౌగం: ఔరౌరా! ఎంతటి అనర్థం దాప
రించిందిరా!

ఏలినాతఁడు దురవస్థపాలుగాఁగ
వచ్చెఁ గారానియీాతలవంపు మనకు;

(3)

చిరమనోరథ మీరీతి సిద్ధిచెంద
నుబ్బిపోవఁడె దాయ ప్రద్యోతుఁ డింక.
ఎంతటి హైన్యమువచ్చిందిరా నాప్రభు
వుకు ?

ఎన్నఁడవంతినాథు గణియింపనిత్రేఁ
డెటు నిల్చు నేఁడు త
త్సన్నిధి?మున్నెనందు పరుసమ్ములు, నేఁ
డెటు వీనులొగ్గునో ?
మిన్నకపోనికిన్క దిగమ్రింగును నేఁ
డెటుః? బంది కక్కటా !
మన్ననయున్ దిరస్కృతి సమానమొ,
మానము దక్కనేర్చునే.

ప్రతీ: (ప్రవేశించి) రక్షాబంధనం తెచ్చా
నండి అయ్యగారూ !
యౌగం: కావలయుకార్య మదియెల్లఁ గడచెఁ
గాదె, చక్కఁబడునొక్క యీరిత్తజతన
ములను, సంగరము ముగిసినమీఁద మంగ
ళార్థ మారతుల నెత్తనేమిటి కర్వమునకు?
ప్రతీ: అయ్యగారూ ! రక్షాబంధనం తెచ్చా
నండి.

యాగం : ఉండనీ, విజయా! ఉండనీ.

ప్రతీ : చిత్తం. అమ్మగారితో ఏమి మనవి చెయ్యమంటారు ?

యాగం : ఇదే—

ప్రతీ : ఏమి టయ్యగారూ అది !

యాగం : అదే, ఈసంగతే.

ప్రతీ : సెలవీయండయ్యగారూ ! ఆసంగతేమో సెలవీయండి.

యాగం : (తనలో) అమ్మగారికి నివేదించకుండా ఎలా దాచట మిది ? ((ప్రకాశం) విజయా ! ధైర్యం తెచ్చుకోవాలి నువ్వు.
(చెవిలో చెప్పును)

ప్రతీ : అయ్యో ! అయ్యో !

యాగం : విజయా ! నీపేరు విజయసుమా మఱవకు.

ప్రతీ : ఏమిచేతును ? నిర్భాగ్యురాలిని, వెళ్ళి మనవిచేస్తాను.

యాగం : జాగ్రత్తసుమా, విజయా ! ఏలినవారు పట్టుబడ్డారని తటాలున చెప్పకుమీ.

తల్లిహృదయం స్నేహదుర్బలం. ఎలా విన్న విస్తావో, నీదే భారం.

ప్రతీ : నా కేమీా పాలుపోకుండా వుం దయ్యగారూ!

యౌగం : ఇదిగో, ముందు యుద్ధములూ, వాటిలో ఆపదలూ, వీటినిగూర్చి ప్రస్తా వించు. అమ్మగారిమనస్సు పరిపరివిధాల పోతుంది. కుమారులకు ఆపద శంకిస్తూ విచారంపాలవుతారు. శోకం అలమిన తరువాత నెమ్మదిగా, జరగిన వృత్తాంతం చెప్పు.

ప్రతీ : చిత్తం. తెలిసిం దయ్యగారూ !

(నిష్క్రమించును)

యౌగం : హంసకా ! నువ్వు ప్రభువుతో కూడా ఎందుకు వెళ్ళావుకావు ?

హంస : సాలంకాయనులు నన్ను, "నువ్వు వెళ్లి ఈవృత్తాంతం కౌశాంబిలో విను పించు" మని నియోగించడంవల్ల నా కాభాగ్యం కలిగిందికాదు.

యౌగం: ఆతఁ డెందుకు పంపినట్లు నిన్ను? మాకు నిరాశ కల్పించడానికా? నీ వంటి విశ్వాసిని ప్రభువుకు దూరంచేయడానికా?

హంస: చిత్తం రెండూ కావచ్చునండి.

యౌగం: ఆతని అతిశయం చాటుకోవడానికీ కావచ్చును, ఔను. ఆతని యత్నం సిద్ధించి నప్పుడు ఏమిచేయఁగూడదు గనుక? హంసకా! ఏలినవారు నామాట ఏమైనా సెలవిచ్చారురా?

హంస: చిత్తం, నేను ప్రదక్షిణంచేసి సెలవు తీసుకొన్నప్పుడు, ఏదో చెప్పఁదలచుకొని, చివరకు, నీరునిండిన కళ్లతో ఈ మాట మాత్రమన్నారు. "హంసకా! నువ్వు యౌగంధ- (అర్ధోక్తిలో ఆగును)

యౌగం: ఏలినవారి మాటలు గదా, చెప్పు సంశయించక.

హంస: యౌగంధరాయణులను చూడవల సిం" దని మాత్రం సెలవిచ్చారండి.

యౌగం: అంతేనా? తక్కిన మంత్రు లెవరి

మాటా ఎత్తక ఒక్క యౌగంధరాయణు
లనే చూడమన్నారా ?

హంస : చిత్త, మంతే అయ్యగారూ.

యౌగం : అవును. ఇన్నాళ్లూ ఏలినవారి
సొమ్ము తినీ, సత్కారాలుపొందీ, బదులు
తీర్చక ఊరకొన్నవాణ్ణి నేనే గనుక నన్ను
చూడవలసిం దన్నారు.

హంస : చిత్తం.

యౌగం: ఈతఁడు మునుపటి యౌగంధరాయ
ణుఁడు కాఁడని ఏలినవారికే తెలుస్తుందిక.

చెఱనున్న శాత్రవపురమునం దున్న
కానయందో, కాలగర్భమ్ము నందో,
ఎందున్న విభుని కే నందె కన్పింతు.
గెలిచితి నని పొంగి కులుకుచున్నట్టి
అరిని వంచించి, రాజ్యమ్ము చేపట్టి
ప్రభుని కర్పించి, సేబా ననిపింతు.

(తెరలో) అయ్యో ! ప్రభువు ! అయ్యో !

యౌగం :

అంతిపురి రేగినట్టి యీ యడలుచిచ్చు
నల్లనల్లనఁ బతిజన మార్పఁదివురు ;

సచివుల యశక్తి వేనోళ్లఁ జాటిచెప్పు
నట్లు వినిపింపఁదొడఁగె నియ్యార్తరవము.

ప్రతీ: (ప్రవేశించి) అమ్మగారండీ—

యౌగం: ఏమి టేమిటి!

ప్రతీ: సెలవిచ్చారండి.

యౌగం: ఏమని?

ప్రతీ: "మీవంటి స్నేహితులంతా ఉండగానే వత్సరాజు కిలా జరిగిందికదా. సమ్మాన్యులైన స్నేహితు లంతా ఆలోచించండి, ఇప్పు డేమి ప్రతిక్రియ చేస్తారో దీనికి. కడగండ్లు వచ్చినప్పుడు కంటనీరుబెట్టు కోవడం, కార్యం తప్పివచ్చినప్పుడు కళ వళపడి, కనులప్పగించడం ఎఱగనివాడవు నువ్వు. వంచన జరిగిం దని కూలిపోవు. ఎంతటి విపత్తువచ్చినా, అధీరుఁడవై ఆత్మహత్య కొడఁబడేవాఁడవు కావు. నీకు చెప్పవలసిం దేముందిగనుక? నాయనా! ఇప్పుడంటే మఁత్రివైనావుగాని మొదటి నుంచీ మాబాబయ్యకు చెలికాఁడవునువ్వు.

బాబూ! మా బాబయ్యను తెచ్చి వప్ప గించు" అని మనవిచెయ్యమన్నారండి.

యౌగం: బళి బళి. రాజవంశోచితమైన యిటువంటి ధీరవాక్యాలు అమ్మగారికే తగును. అమ్మగారు చూపిన యీ మన్నన శిరసావహిస్తున్నాను. విజయా! ఉదక మేదీ!

ప్రతీ: చిత్తం (నిష్క్రమించి ఉదకం తెచ్చి) ఇది గో, అయ్యగారూ!

యౌగం: ఇలా యివ్వు. (ఆచమించి) విజయా! ఏమన్నారూ అమ్మగారు?

ప్రతీ: "బాబూ! మా బాబయ్యను తెచ్చి వప్పగించు" అన్నారండి.

యౌగం: హంసకా! ఏలినవా రేమన్నారూ?

హంస: యౌగంధరాయణులను చూడవలసిం దన్నారండి.

యౌగం: విజయా!

కలువరాయని రాహు కబళించినట్లు
పరబలమ్ములు చుట్టిపట్టునుగాక,

వేల్మిడి నాస్వామి విడిపించవకున్నఁ
గానుసూ నేను యౌగంధరాయణుఁడ.

ప్రతి: తథాస్తు.

(నిర్మ్నఁడపుఁడు ప్రవేశించును.)

నిర్మం: దేవర కౌకవిచిత్రం మనవిచేయు డానికి వచ్చాను. ఏలినవారికి శాంతి నిమిత్తం బ్రాహ్మణసంతర్పణం జరుగు తూండగా అచ్చటికి వెఱ్ఱివేషంతో ఒక బ్రాహ్మణుడు వచ్చాడండి. వచ్చి, పెద్ద పెట్టున నవ్వుతూ, "తినండి, బ్రాహ్మణు ల్లారా! ఇచ్చవచ్చినట్లు తినండి. ఈరాజ వంశానికి శుభం కలుగుతుంది" అంటూనే అట్టె అదృశ్యుడైపోయినాడు.

యౌగం: చెప్పవూ!

బ్రాహ్మణుడొకడు: (ప్రవేశించి) ఇవిగోనండి, ఆయన ధరించినవస్త్రాలు! ఇక్కడే వదలి

పెట్టి వెళ్ళారు. వారు సాక్షాత్తు వ్యాసుల వారుకాని మరొకటి కాదు.

యౌగం: వ్యాసులవారే నంటారా!

బ్రాహ్మ: చిత్తం.

యౌగం: అవియేవి, చూస్తాను.

బ్రాహ్మ: ఇవిగో! చిత్తగించండి.

యౌగం: (పైనకప్పుకొంటూ) ఏమి! రూపు మారిందా నాకు! ఏమిటిది! ప్రభుసన్నిధానంలో వున్నానా నేను! బళిబళీ! ఇవి నాకోసమే వదలివెళ్ళినట్లున్నది!

ఉన్మత్తవేషమ్ము నూనె వ్యాసుండు
విడిపింతు ప్రభువు నీవేషమే తాల్చి.

ప్రతీహారి: (ప్రవేశించి) అమ్మగారు 'బాబు నొకసారి చూడవలె' నని సెలవిచ్చారండి.

యౌగం: ఇదుగో, వస్తున్నాను, అయ్యా! మీరు శాంతిగృహంవద్ద నుండండి. నేను వస్తాను.

బ్రాహ్మ : చిత్తం. (నిష్క్రమించును.)

యౌగం: హంసకా! నీ విక విశ్రమించవచ్చు.

హంస : చిత్తం. (నిష్క్రమించును.)

యౌగం : విజయా ! ముందు నడువు.

ప్రతీ : చిత్తము.

యౌగం :

కాష్ఠము మథింప మథియింపఁ గలుగు నగ్ని,
నేల త్రవ్వంగఁద్రవ్వంగ నీరు వొడము,
ఫల మొసఁగు సక్రమారబ్ధములగుపను, ల
సాధ్యమే యుండ దుత్సాహశక్తి యున్న.

( నిష్క్రమించును. )

ఇది ప్రథమాంకము.



# ప్రతిజ్ఞాయౌగంధరాయణం

## ద్వితీయాంకము

( కాంచుకీయుడు ప్రవేశించును )

కంచు: ఆభీరకా! ఆభీరకా! మహాసేనుల ఆజ్ఞగా ద్వారరక్షకులతో చెప్పు. కాశీ రాజ గురువైన ఖైవంతయ్య మాతన్నై వచ్చారట. సామాన్యాతిథులవలె కాక వారిని విశేష సత్కారాలచే ఉపచరించి వారిసౌఖ్యం విచారించవలసిం దని చెప్పి రా, నువ్వు వెళ్లి. రోజు రోజూ ఇదీవరస. రాజకన్యను పెండ్లి కడగడం కోసం రాజమాత లెవరో రావడం, పోవడమూ, అంతేకాని, మహాసేను లెవ్వరికీ 'అవును, కాదు' అని తేల్చిచెప్పరు. కారణ మేమిటో తెలియదు. నాకు జూడగా ఈ రాజకన్యా వివాహం దైవంచేతిలో వున్నట్లు కన్పిస్తుంది. కాకపోతే, ఈ కన్య కు వరుడు కాదగిన రాజువద్దనుంచి ఇంకా

దూత రాకనైనా పోవాలి. ఆ దూతకోసం
కనుపెట్టివున్నారు మహాసేనులు. అందు
వల్లనే వచ్చినవరుల గుణాగుణముల ప్రస్తా
వమే చేయకపోవడం. ఇదిగో, ఈ యంతః
పుర పరిజనుల ముఖాలు ముకుళించుట
చూడగా మహాసేనులు దయచేస్తూ వుం
డాలి. అదుగో ! మహాసేనులు !

శరవణమ్ము వెడలి చనుదెంచు దేవసే
నాని యన నవంతినాథుఁ డదిగొ !
కనకతాళివనము గదలివచ్చెడు నీల
ఖచితవలయబాహుకాంతితోడ.

(నిష్క్రమించును)

## ఇది విష్కంభము.

(సపరివారుడై రాజు ప్రవేశించును.)

రాజు : అస్మదీయతురంగఖురాగ్రధూళి
తల ధరింతురు భృత్యులై ధరణిపతులు,
గుణసమేతుండు గజశాస్త్రకోవిదుండు
వత్సపతి యొక్కఁడే తలవంపఁ డకట.
బాదరాయణా !

కంచుకి : (ప్రవేశించి) మహాసేనులకు జయము.

రాజు : వైవంతికి విడిది చూపినారుకాదూ!

కంచు : చిత్తం. విడిదిచేయించి అర్హమైన సత్కారాలతో ఉపచరించాము.

రాజు : మన సంస్థాన గౌరవం ఎఱిగిన నీకు వేఱే చెప్పవలెఱుగనుకనా? ఈ యతిథి సత్కారాలలో ఎవ్వరూ ఏమీ లోపం చేయరు గాని అమ్మాయి వివాహ ప్రస్తావం చేసేటప్పటికి అదేమో ఒక్కరూ మనసు విప్పి చెప్పరు. (కంచుకివంక చూచి) బాదరాయణా! నువ్వేదో చెప్పఁదలఁచిన ట్లున్నావు?

కంచు : చిత్తం, అమ్మాయిగారి వివాహం మాఱే మనవిచేయాలని...

రాజు : అయితే చెప్పు, మఱి సందేహ మెందుకు? ఇది అందఱికీ కావలసిందే.

కంచు : చిత్తం. ఏలినవారి నొక్కమాట అడుగుతాను. అమ్మాయిగారికి తగినసంబంధా లెన్నో రోజూ వచ్చిపోతున్నవి

గదా, మహాసేను లెవరికీ, అవునూ కాదూ అని తేల్చి చెప్ప రెందువల్ల అని నాలో నేనే అనుకుంటూ వుంటాను.

రాజు : నిజమే, మే మా మాట కాదనం. అమ్మాయి, వాసవదత్తపై ప్రీతిచేతా, ఇంకా మంచి వరుడు రావలెననే లోభం చేతా ఎటూ నిశ్చయించలేకుండా వున్నాము.

అన్నిటికంటె ముఖ్యము
సదన్వయశాలిత, అంతకంటె మా
కన్నను గండ్లనద్దుకొనఁ గల్గు
దయార్ద్రత ముఖ్య, మింక రూ
పోన్నతి కేమి గాని,- అది యుండక
మెచ్చదు స్త్రీ జనమ్ము ; శౌ
ర్యోన్నతి లేనివాఁడు సతి
నోమఁగ నేర్చునె ? ఇన్నియుండియన్.

కంచు : మహాసేనుల కన్నవని యిన్ని గుణాలు లోకంలో మఱి యెవరి కుఁటవి?

రాజు : మేమూ అదే ఆలోచిస్తున్నాము. బిడ్డ సుఖపడవలెనని ఎంతో ఆలోచించి వరుణ్ణి తేవడమే మనవంతు. అంతకంటె ఏమి చేయగలం? పిమ్మట అమ్మాయి అదృష్ట మెలావుంటే అలా అవుతుంది. ఇంతకుఁ బిల్ల నివ్వడంలో ఉండే కష్టమంతా కన్నతల్లిది. ఏదీ, దేవి నొకసారి యిలా పిలువు.

కంచు : మహాసేనుల యాజ్ఞ. (నిష్క్రమించును)

రాజు : కాశీరాజు దూత నంపడం, సమయానికి సాలంకాయనుడు లేకపోవడమూను. వత్సరాజును పట్టబోయిన యీ బ్రాహ్మణుఁ డింతవఱకు ఏవార్తా పంపినాఁడే కాదు. వత్సరాజు కున్న గజగ్రహణ వ్యసనాన్ని పురస్కరించుకున్నది గనుక మా పదకం బహుశః వ్యర్థం కాకూడదు. కాని, అతనిమంత్రులేమి ప్రతివ్యూహం పన్నారో!

దేవి : (ప్రవేశించి) జయము! మహాసేనులకు.

రాజు : అలా కూర్చో,

దేవి : చిత్తం.

రాజు : అమ్మాయి ఏమి చేస్తున్నది ?

దేవి : ఆ వైతాళికురాలు ఉత్తర చెంత వుంది. నారదవీణ నేర్చుకొంటున్నది.

రాజు : అమ్మాయి కీ సంగీతాభిలాష ఎప్పటి నుంచి.

దేవి : స్నేహితురాలు, కాంచనమాల వీణ వాయించడం చూచి, తానూ నేర్చుకొంటానని మొదలుపెట్టింది.

రాజు : అవును. ఇంకా బాల్యంకదా మఱి.

దేవి : మహాసేనుల కొక విన్నపం చేయు మన్నది అమ్మాయి.

రాజు : ఏమని ?

దేవి : తనకు గురువు కావలెనంటూ వుంది.

రాజు : ఒకవంక పెండ్లియీడు వచ్చినదాని కిప్పుడు గురు వెందుకు? అంత కావలసివస్తే భర్తయే నేర్పుకుంటాడు.

దేవి: నాతల్లి కప్పుడే అంత పెండ్లితొందర యేమి వచ్చింది!

రాజు: బాగున్నది. 'పెండ్లిచేయండి, పెండ్లి చేయం' డని నిత్యమూ మమ్ము తొందర పెట్టుతూ, ఇప్పుడిలా అనడమేమిటి ?

దేవి: బిడ్డ నెడబాయవలసివస్తుందనే కాని ఇప్పుడుమాత్రం కాదంటానా ? వరుఁ డె వరు, ఇంతకు?

రాజు: ఏదీ! ఇంకా నిశ్చయించలేదు.

దేవి: మఱి యింకా యెప్పటికి నిశ్చయించేది?

రాజు: ఈడువచ్చుకన్న యింటనుండిన సిగ్గు,
ఒరుల కిచ్చిసేయ నొదవుఁ జింత ;
ఒకట ధర్మభీతి, యొకట నెయ్యము బట్టి
లాగఁ, దల్లిహృదయ మూఁగులాడు.

చూడు, ఎంత యాలోచించినా, అమ్మా యి వాసవదత్తకు, అత్తవారిపరిచర్య చేసుకోదగినయీడు వచ్చినమాట నిజం. ఇవ్వాళ్ల మళ్ళా కాశీరాజోపాధ్యాయులు పిల్ల నడుగవచ్చారు. పెండ్లికొడుకు గుణ

వంతుఁడని అనేకవిధాల చెప్పుతున్నాఁడు. ఏమంటావు? (తనలో) మత్రే, మాట్లా డదు. అలా కంట నీరుబెట్టుకోనేది ఏమని నిశ్చయించగలుగుతుంది! అయినా చెప్పి చూద్దాము. (ప్రకాశం) ఈవఱకు వచ్చిన రాజసంబంధాలు నువ్వూ విన్న వేగనుక—

దేవి: ఈ వివరాలన్నీ నా కేమి తెలుస్తవి? మనకు వెనకచింత లేకుండా, బిడ్డ సుఖపడే చోటుగా చూచి మీరే నిశ్చయించండి.

రాజు: అదిగో, ఇప్పుడిలా అని అనక మమ్మ నిందించితే కాదు. మాగధవాంగసౌరాష్ట్ర శూరసేనదేశాధీశ్వరు లడుగుతున్నారు. కావడాని కన్నీ మంచిసంబంధాలే. నువ్వూ ఆలోచించి వీరిలో ఎవరు యోగ్యుడో చెప్పు.

కాంచు: (ప్రవేశించి) వత్సరాజు—

రాజు: ఏమి! వత్సరాజా!

కాంచు: చిత్తం చిత్తం. శుభవార్త మనవి చేయవలె ననే తొందరలో మర్యాద

నతిక్రమించాను. అనుగ్రహించాలి మహా
సేనులు.

రాజు : ఏమి టా శుభవార్త ?

దేవి : (లేచి) మహాసేనులు, నాకు అనుజ్ఞ
యిప్పించండి.

రాజు : దేవీ ! శుభవార్త విని వెళ్ళుదువుగాని
కూర్చో.

దేవి : చిత్తము. (కూర్చుండును.)

రాజు : లేలే. భయంలేదు. ఆవార్త యేమో
వినిపించు.

కంచు: (లేచి) అమాత్యులు, సాలంకాయనులు
వత్సరాజును పట్టుకొన్నారు.

రాజు : ఏమిటి ! ఏమన్నావు ?

కంచు: అమాత్యులు, సాలంకాయనులు వత్స
రాజును పట్టుకొన్నారు.

రాజు : ఉదయనుణ్ణి !

కంచు : చిత్తం.

రాజు : శతానీకపుత్రుణ్ణి !

కంచు : చిత్తము.

రాజు : వహాసాసేనుని మనుమణ్ణేనా ?

కంచు : వారినే.

రాజు : కౌశాంబీపతినే !

కంచు ; చిత్తం.

రాజు : ఆ గాంధర్వకోవిదుణ్ణేనా ?

కంచు : చిత్తం. ఆయన్నే.

రాజు : చూడు, వత్సరాజునే నంటావా?

కంచు : చిత్తం. వత్సరాజునే.

రాజు : అయితే, యౌగంధరాయణుఁడు మరణించివుండాలి.

కంచు: లేదు. ఆయన కౌశాంబిలో వున్నాడు.

రాజు : ఉంటే వత్సరాజు పట్టుబడినమాట వట్టిది.

కంచు: నామాట విశ్వసించరా, మహాసేనులు?

రాజు : ఈవు వచించితేని మఱి యే నెటు

నమ్మెదు ? మందరాగముఁ

కేవదలిర్ప హస్తములచేఁ గదలింతురు

గాక, శతుౄధా

తీవ్రవరనుత్యవిక్రమునిఁ జెత్తురె,
వత్సనృపాలు బందిగా !
నీవును నేము మున్ను వినమే, మతిగీప్పతి
వానివ్రిగ్గడన్ ?

కాంచు : చిత్తం. వృద్ధుణ్ణి, బ్రాహ్మణుడను, మహాసేనులతో మును పెన్నడూ అసత్యం విన్నవించినవాణ్ణి కాను.

రాజు: నిజమే. నీమాట నమ్మదగినదే. అయితే సాలంకాయనులవద్దనుంచి యీ ప్రియవార్త తెచ్చిన దూత యెవరు ?

కాంచు : దూత యెవరూ రాలేదు. వత్సరాజ పురస్కృతులై, జవాశ్వములు పూన్చిన రథంమీద సాలంకాయనులే వచ్చారు.

రాజు: తానే వచ్చినాడా! సెబాసు. ఇక మన అక్షౌహిణు లన్నీ సన్నాహం మాని తీరికగా కూర్చుండవచ్చు. రాజు లంతా మా వేగులవాండ్రిశంక లేకుండా నిశ్చింతగా నుండవచ్చు నిఁక. ఇంత యెందుకు ? మహాసేనుల మివ్వాళైనాము మేము.

దేవి : అమాత్యు లాయన్ని వెంటబెట్టుకొనే వచ్చారా ?

రాజు : ఆహా.

దేవి : అయితే అమ్మాయి నెవ్వరి కివ్వవలెనా అనే దిగులు తీరింది.

రాజు : ఆఁ ఆఁ! బంధించి తెచ్చాముసుమా, ఆతణ్ణి! బాదరాయణా! సాలంకాయను డేరీ?

కాంచు : అమాత్యులు భద్రద్వారంలో వేచి వున్నారు.

రాజు : నువ్వు వెళ్లి భరతరోహకులతో చెప్పు, వత్సరాజపురస్కృతుఁడైన అమాత్యుని యువరాజోచితమైన సత్కారంతో ప్రవేశ పెట్టు మని.

కాంచు : మహాసేనుల ఆజ్ఞ.

రాజు : ఇదిగో! కొంచె మాగు.

కాంచు : చిత్తము.

రాజు : వత్సరాజను మాప్రజ లంతా చూడ వచ్చు నని చెప్పు. ఇన్నాళ్లూ ఆతని కథలు

[illegible]మేగాని ప్రజ లాతృప్తి చూడలేదు. [illegible]వును తీయడానికి తెచ్చిన సింహం [illegible], కోపంచేత లోలోపల కుములు తున్న శత్రువును ప్రజ లంతా తనివిదీర చూసివచ్చునని చెప్ప[illegible].

కాంచు : మహాశయుల యాజ్ఞ. (నిష్క్రమించును.)

దేవి : ఇదివరకు రాజకులంలో ఎన్నో ఉత్స వాలూ, వేడుకలూ జరిగినవిగాని మహా సేను లింత సంతోషంగా ఉండగా చూడ లేదు.

రాజు : అవును. ఇంతటి ప్రియవార్త మును పెన్నడూ విన్నట్లు మాకూ జ్ఞప్తి లేదు.

దేవి : అయితే ఆ పట్టుబడ్డది వత్సరాజే నంటారా ?

రాజు : కాక !

దేవి : ఎందరో రాజులు పంపారుగాని మన సంబంధం కోరి, వత్సరాజుమాత్రం దూత నంపలేదు.

రాజు : మమ్ము మహాసేను లనటమే గిట్టని వాఁడు మనసంబంధం కోరుతాఁడా.

దేవి: గిట్టకపోవడాని కాయన కేమి చిన్న తనమా? తెలివిమాలినవాడా?

రాజు: చిన్నతన మయితే కావచ్చునుగాని తెలివిమాలినతనం మాత్రం కాదు.

దేవి: ఎందువల్లనో ఇంతయభిమాన మాయనకు?

రాజు: ఎందువల్లనా? వేదధర్మ ప్రతిష్ఠితమూ రాజర్షి జన్మధన్యమూ అయిన భరతవంశంలో పుట్టాననీ. గాంధర్వవిద్యలో తనంతవాడు లేడనీ, వీటికితోడు వయసువాడననే మిడిసిపాటూ, అందగాడననే గర్వమూను. పైగా తనంతటి ప్రజారంజకుడు లేడనే అతిశయమూ.

దేవి: కొఱమాలిన గర్వమొకటి వచ్చిపడింది గాని అల్లునికి గావలసిన గుణాలన్నీ వున్నవి.

రాజు: దేవీ! మెచ్చదగనివాణ్ణి మెచ్చుకుంటున్నావుసుమా. సర్వదాహాకమైన కార్చిచ్చువలె ఎదురులేని మాశాసనాన్ని ధిక్కరించే వాణ్ణి చూచి మురిసిపోతున్నావు.

కాంచు: (ప్రవేశించి) మహాసేనులకు జయం. సాలంకాయనులు యథోచితంగా ప్రవేశించినారు. భరతవంశ్యులైన రాజులు లాలించే ఘోషవతి అనే ఈవీణారత్నం వత్సరాజుది. అమాత్యులు మహాసేనులకు దీనిని కానుక పెట్టుతున్నారు. (వీణను చూపును)

రాజు: మహాసంతోషం. ఏదీ, ఆ విజయలాంఛనం! (వీణనందుకొని) ఇదియా ఘోషవతి!

వాలారుగోనగోళ్ల లీలమీటినఁ, దేనె
జాలులై, వీనులకు సంతర్పణమ్ము లౌ
పూలపాటలువాడు పుట్టురత్నమ వీవు,
మఱగించి మదకరుల మచ్చికయొనర్తువట!
ఘోషవతి! యెట నేర్చుకొంటివేమంత్రములు

ఆహాహా! సుఖమంటే రణవిజయలబ్ధములైన యిటువంటి రత్నములభోగమే సుఖం. ఎవరి కిత్తు నీ యనర్ఘరత్నాన్ని? యువరాజు గోపాలకుఁ డర్థశాస్త్రవ్యసని, ఇక రెండవ వాఁడు వ్యాయామశీలీ; గాంధర్వమంటేనే గిట్టదు వానికి. దేవీ! వాసవదత్త వీణకై మనసు పడుతున్నదంటివి గాదూ?

దేవి: చిత్రం.

రాజు: అయితే అమ్మాయికే యివ్వు దీనిని.

దేవి: ఈ వీణ యిచ్చామూ అంటే ఇక అదే పిచ్చిలో పడిపోతుంది బిడ్డ.

రాజు: పోనీ, అత్తవారింట నాటలూ పాటలూ ఎలాగూ సాగవు. ఇక్కడుండగానే వినోదించనీ. బాదరాయణా! అమ్మాయి ఎక్కడున్నది ?

కాంచు: అమాత్యులచెంత నున్నారు.

రాజు: మఱి వత్సరాజో ?

కాంచు: ఆయన యిప్పటికి గొంత దారిలోకి రావటంవల్లా, ఒళ్లూ పాదాలూ గాయపడి వుండటంవల్లా డోలీలో ఎక్కించి, నెమ్మదిగా మధ్యగృహంలో ప్రవేశపెట్టారు.

రాజు: పాపం, దెబ్బలు మోపుగా దగిలి వుండాలి. ఇంతకు, ఆతని దుర్దమశౌర్యము దీదోష మంతా. మన మీస్థితిలో ఉపేక్షించడం రాక్షసకృత్యంగావుంటుంది. నువ్వు వెళ్ళి భరతరోహకులతో చెప్పు. గాయాలకు కట్లు కట్టించవలసిం దని.

కాంచు : మహాసేనుల ఆజ్ఞ.

రాజు : ఇదిగో, ఇటు చూడు.

కాంచు : చిత్తము.

రాజు : ఆయనకు ఏలోపం జరగకూడదు సుమా. చూపులనుబట్టి గ్రహించి సత్కారములు జరపాలి. గడచిపోయిన పాత పగల నెవ్వరూ తడవగూడ దాయన చెంత. ఆయన తుమ్మినా, దగ్గినా 'చిరంజీవ' అంటూ, సమయ మెఱిగి స్తుతిపాఠములు చేస్తూ ఉపచరించాలి.

కాంచు : మహాసేనుల ఆజ్ఞ. (నిష్క్రమించి మరల ప్రవేశించి) వత్సరాజులుంగారి గాయాలకు తోవలోనే కట్టు కట్టడంవల్ల మళ్లా రెండో కట్టు ఇప్పు డక్కఱలే దన్నారు. పొద్దు ఇప్పుడే నడిమింటి కెక్కింది.

రాజు : ఎక్కడున్నా డిప్పు డా వీరమాని ?

కాంచు : మయూరయష్టివద్ద వున్నారు.

రాజు : అయ్యో ! అక్కడ ఎండలో ఎందు కున్నాడు ? వెంటనే మణిభూమికలో ప్రవేశపెట్టించు. చల్లగా నుంటుంది.

కాంచు: మహాసేనుల యాజ్ఞ. (నిష్క్రమించి మరల ప్రవేశించి) మహాసేనుల ఆజ్ఞప్రకారం సర్వమూ జరిగింది. అమాత్యులు భరతరోహకులు దేవరదర్శనం కోరుతున్నారు.

రాజు : అవును. వత్సరాజు నిలా ఉపచరించడం ఆయనకు రుచించదు. ఇదే ఆయనకీతిపరిశ్రమ. మేమాయననుసమాధానపరుస్తాము.

దేవి: ఇంతకు పెండ్లిమాట ఏమిఆలోచించారు?

రాజు : ఏదీ ఇంకా నిశ్చయించ లేదు.

దేవి : నా తల్లి యింకా పసిది. ఇప్పు డప్పుడే తొందర లేదు లెండి.

రాజు: కానీ నీఇష్టంచొప్పునే. నువ్వికలోనికివెళ్లు

దేవి : మహాసేనుల యాజ్ఞ (నిష్క్రమించును)

రాజు : (ఆలోచించి)

వగతుఁ డామె నిన్నాళ్లు గర్వమునఁ జేసి
బద్ధుఁడైనంత వీనిపైఁ బగయడంగి
భావము దటస్థమయ్యె; విపన్నుఁడగుట
యరసినంత వికావికలయ్యె మనసు.

(నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.

# ప్రతిజ్ఞాయౌగంధరాయణం

## తృతీయాంకము

(యౌగంధరాయణుడు బ్రాహ్మణవేషంతో విదూషకుడు ప్రవేశించును.)

విదూ : (పరికించి) ఏమయిందబ్బా, నా కుడుములమల్లె! ఇప్పుడేకదా యీ దేవాలయ పీఠంమీద పెట్టుకొన్నాను. అక్కడపెట్టి దక్షిణడబ్బులు లెక్కచూచి మూటగట్టుకొన్నాను; ఇంతే. వెనక్కి తిరిగి చూచేటప్పటికి కనిపించదు. ఇంతలోనే ఎలా మటుమాయమైపోయింది! ఇందాక వాడెవడో వెంటబడితే ఓకుడు మిచ్చాను, దానితో సంతోషించి వెళ్లిపోయినాడు. ఒకవేళ ఏదైనా కుక్కయెత్తుకుపోయిందేమో అంటే, ఇంత యెత్తున ఈ గోడ దాటి యెలా వస్తవి కుక్కలు! పోనీ బాటసారు లెవరైనా పసిబట్టి కాజేసారనుకోడానికి, ఇంకా కుడుములు తుంచక

ముందే ఎట్లా వాసన తెలుస్తుంది?
కొంపతీసి నేనే తినివేయలేదు కదా?
అయినా చూస్తాను. (తేపును) ముసలి
పంది కడుపులాగ బుస్సుమంటూ వట్టి
గాలి బయలుదేరుతున్న; దంతే. ఆ!
అన్నట్లు—ఈశివుడు కాజేసివుండాలి.
కాత్యాయనీ ప్రసాదంగనుక, యీ కుడు
ములు తనసొత్తే అనుకొని చల్లగా సంగ్ర
హించాడు. ఈ బ్రహ్మచారిని నమ్మ
రాదు. ఇటువంటి కొంటెపనులకు మొనగా
డీతడు. అయినా అడిగిచూస్తాను. ఏమి
స్వామీ! నా కుడుములవల్ల కాజేసి, బెల్లం
కొట్టిన రాయివలె కూర్చుని పలకరేం?
అదిగో, ఈయన పాదాలచెంతనేవుంది.
అమ్మదొంగా! ఎంతపని చేసావంటేనూ!
ఇవ్వు, నామల్ల నాకివ్వు. ఇస్తావా, లేదా?
మరే! ఇవ్వు స్వామీ! నీపాదాలు మొక్కు
తాను. (మల్లతీసుకోబోయి) శివశివా! నా
తెలివి తెల్లవారినట్లే వుంది. ఇది గోడ
మీద చిత్రించిన బొమ్మ. మతిమాలిన

వాణ్ణి, నిజంగా నా మల్లచిప్పే అనుకొన్నాను. అయితే, ఆగు, ఇది తుడిచిపారేస్తాను. (తుడిచి) మత్తే! తుడిచినకొద్దీ మెరుస్తున్న వీరంగులు. బలేరా! చిత్రకారుడా, ప్రజ్ఞంటే నీదే ప్రజ్ఞ! వుండువుండు. ఇల్లాకాదు. నీళ్ళతో కడిగేస్తే సరి. ఎందుకుపోదో చూస్తాను. నీ ళ్లేవీయిక్కడ? ఇదిగో కొలను. ఈనీళ్లు తెచ్చి, కడిగివేస్తేసరి. అంతటితో ఈశివుడి బులుపు వదలి పోతుంది. నాకు లేని కుడుములు తనకెందు కుండాలి?

(తెరలో) కుడుములోయి, కుడుములు! ఎవరికోయి కుడుములు!

విదూ: (చూచి) ఇదిగో, ఈ వెట్టిముండాకొడుకు నా కుడుములమల్ల ఎత్తుక పారిపోతున్నాడు. ఆనవ్వు చూడు! ఆ పరుగు చూడు! వీధిలో నురుగులుగట్టుతూ పరిగెత్తే మురుగు కాలవలాగ; ఏమిరా, నాయనా! నీ అవతారము! ఆగుఆగు. వెట్టివెధవా! ఆగుతావా, లేదా? ఇదిగో, ఈ వెదురుకట్టతో నీతల చిదుకబాదుస్తాను, ఆగకపోతివాంటే.

వెట్టివాడు: (పరిశీలించి) కుడుములోయి! కుడుములు. హాహాహాహా!

విదూ: ఇదిగో, నాకుడుము లిస్తావా ఇవ్వవా?

వెట్టి: కుడుములా! ఎక్కడివి, ఎవరివి? ఏవీ? మూటగట్టుకొన్నవా, పారేసుకొన్నవా, తినేసినవా?

విదూ: తినేసినవీకావు, పారేసుకొన్నవీకావు. ఆ మల్లలోనివి. ఇస్తావా, లేదా?

వెట్టి: ఇవేనా? అయినా చూస్తానుండు, నో రూరిస్తున్నవి.

విదూ: ఆఁ ఆఁ! పరులసొమ్ము కాసిస్తే వగ్గాలతో కట్టి పడవేస్తారు.

వెట్టి: నన్ను కట్టివేసేదెవరు? నా కుడుములే నన్ను కాపాడుతవి. ఆహా! ముచ్చటగా, కంటికింపై, ఎంత ముద్దొస్తున్నవో! దివాణంలోకి తీసుకెళ్లితే డబ్బిస్తారు. కాలాన్ని బట్టి అంతలో దుర్బలమవుతాయి గాని.

విదూ: బాబూ! నా కుడుములమల్ల నాకిద్దూ. మా గురువుగారి వూరు వెళ్ళాలని తెచ్చుకొన్నాను.

వెట్టి : హిహిహి ! వీటితో నేను నూరామడ దూరం వెళ్ళాలి.

విదూ : నూరామడే! నువ్వేమి ఐరావతానివా!

వెట్టి : ఔను. నే నైరావతాన్నే. మరేమను కొన్నావు? దేవరాజుగారు నాపై స్వారి చేస్తారు. ఇంద్రుడుగారిని పాపం, పాదాలు కట్టి పడవేసారట ! ఇదిగో, మెఱుపు గోరడాలతో గొట్టి, ప్రభంజన భ్రమణాల తో చెదరగొట్టి, ధారాని గళాలతో ఈ మేఘబంధనాలు ఎగరగొట్టుతాను.

విదూ : ఇదిగో, నా కుడుములు నా కిద్దూ. నన్నెందు కేడిపిస్తావు ?

వెట్టి : ఊ ! ఏడువు, మొత్తుకో.

విదూ : అయ్యో ! చస్తిని చస్తినత్తా !

వెట్టి : నేనూ ఏడుస్తాను. నా చేతకాదా ? పట్టినా రిందుడ్ణి చెఱపట్టిరట్రో ! ఇంద్రుణ్ణి పట్టినా రింద్రుణ్ణి మొట్రో !

విదూ: అమ్మో ! నాయనో! చంపేస్తున్నాడు. (తెరలో) భయపడకు బ్రాహ్మణోపాసకా! భయపడకు.

విదూ: (సంతోషిస్తూ) అమ్మయ్య! ఈశ్రమణ కుడు వస్తున్నాడిక భయంలేదు. చంద్రునితో పాటు నక్షత్రాలూ వస్తవి. ఛీ ఛీ! బాపనబ్రతు కెంత పాపపుబ్రతుకో! శ్రమణకుడు రక్షించవలసివచ్చె.

శ్రమణకుడు: (ప్రవేశించి) భయంలేదు, బ్రాహ్మణోపాసకా! భయంలేదు. ఎవరిక్కడ? ఏంజరిగింది? ఎందుకలా ఏడుస్తావు?

విదూ: బ్రతికాను, ద్వారరక్షకునివలె చక్కా వచ్చాడీశ్రమణకుడు. చూడండి స్వామీ! ఈవెట్టివాడు నాకుడుముల మల్ల కాస్త్రా కాజేసి, ఇవ్వక యెట్లా ఏడిపిస్తున్నాడో!

శ్రమ: కుడుములా? ఏవీ నన్ను చూడనివ్వు.

వెట్టి: ఇదిగో! చూచుకోండి స్వాములు.

శ్రమ: ధూధూ (వానిపైనుమియును)

విదూ: శివ శివా! వెట్టివాడిచేతిలో చెక్కు చెదరకుండా నిక్షేపంవలె వున్ననాకుడుములపై తుపుక్కున ఉమిసి, ఎంగిలి చేసాడీశ్రమణకు డిదేమి పాపమో.

శ్రీమ : ఉన్మత్తోపాసకా! ఆకుడుము లిచ్చి వెయ్యి. బుడగలుగట్టిన నీటిపై నురువు లాగా తెల్లగా మెత్తగా పులుసుకంపుగొట్టే ఆకల్లుండలు తింటివా, క్షయరోగంవచ్చి చస్తావు; వద్దు, ఇచ్చివెయ్యి వాటిని.

విదూ: అయ్యయ్యో! కుడుములనుకొన్నాను. కల్లుండలుకాబోలురా, దేవుడా!

శ్రీమ: ఇచ్చివెయ్యి, ఉన్మత్తోపాసకా! ఇచ్చి వెయ్యి. లేకుంటే శపిస్తా నిన్ను.

వెట్టి: మన్నించండి స్వామీ! మన్నించండి. వద్దువద్దు, శపించకండి. ఇవిగో! తీసుకో నీ కుడుములు.

శ్రీమ: చూచావటయ్యా! బ్రాహ్మణోపాసకా నా ప్రభావం.

విదూ: శ్రమణకుడు శపించిపోతాడనే భయం కొద్దీ వెట్టివాడు కుడుములమల్లా మునివేళ్ల తో పట్టుకు నుంచున్నాడు. ఇలా యివ్వు.

శ్రీమ: సరేగాని, ఆ కుడుములతో నాకు స్వస్తి చెప్పవు ?

విదూ: హిహిహి! నాకుడుములతో నీకు స్వస్తి చెప్పవలెనా? ఆ గృహస్థు చేతులారా నాకు దానంచేసిన కుడుములుగదా! సరే కానీ, నీకుగూడా నేను కానుకపెట్టుతాను! ఆ గృహస్థు చల్లగావుండాలేగాని. అదుగో. వెఱ్ఱివాడు అగ్నిగృహంలోకి వెళ్ళు తున్నాడు. అప్పుడే మధ్యాహ్నమయింది. ప్రొద్దింకా నడినెత్తికి రాకముందే యిక్కడ మనిషి అలికిడివుండదు. నేనూ, ఈదక్షిణ డబ్బులు తొర్రివలో ఎవరింటిలోనో దాచి నాదారినిపోతాను. గోచిపాత కొంక జేడిస్తే డబ్బుకోస మొక జేడుస్తాడు. అంతేమరి.

(అందఱు అగ్నిగృహం ప్రవేశింతురు.)

యౌగం: వసంతకా! ఈ యగ్నిగృహంలో ఎవరూ లేరుగదా?

విదూ: ఎబ్బే! ఎవరుంటారండి యిక్కడ?

యౌగం: అయితే మిమ్ము నొక్కసారి కౌగిలించుకొంటాను. (ఇరువురను కౌగిలించుకొనును)

మీ రిద్దరు అలసివున్నారు. కూర్చోండి.

ఉభ: చిత్తము. (అందఱు కూర్చుందురు.)

యాగం: వసంతకా! ఏలినవారు కనిపిం
చారా, నీకు?
వసం: కనిపించారు.
యాగం: అబ్బ! ఈ రాత్రికూడా ఎలాగో
సుఖంగా గడిచింది. మళ్ళా ఈ పగలు
గడవాలి. ఇలా రాత్రికిరాత్రీ, పగటికిపగ
లూ, ఏమి అనర్థంమూడుతుందో అనేదిగులు
తో, ఒక్కొక్క యుగంగా గడుస్తున్నవి.
రుమణ్వాం: బాగా సెలవిచ్చారు. కష్టకాల
మందు పగటికంటె రాత్రి బహుచెడ్డది.
యాగం: వసంతకా! ఏలినవారితో మాట్లాడి
నావా నీవు?
వసం: చిత్తం. చాలాసేపు మాట్లాడినాము
మేము. ఏలినవారు చతుర్దశీస్నానం చేస్తు
న్నంతసేపూ నేను చెంతనే వున్నాను.
యాగం: స్నానంచేసారూ, ఏలినవారు!
వసం: ఆహా! చేసారండి.
యాగం: దేవపూజకూడా చేసికొన్నారా?
వసం: అదే దేవపూజ! ఏదో ప్రణామంచేసి
సరిపెట్టుకొన్నారు.

యుగం : ఏలినవారి కామాత్రమైన స్వాస్థ్యం కలిగినందుకు సంతోషమేకాని, స్నానానంతరం పుణ్యాహఘోషమూ పటహాధ్వానమూ తోడుగా, దేవపూజచేసుకొనే వారు ఏలినవారు. అటువంటి ప్రభువు ఇప్పుడు దేవతాప్రణామం చేస్తూవుంటే సంకెళ్లు మోగుతున్నవిగదా! ఎంతటి దుష్కాలం వచ్చిందోయి!

రుమ : తమయత్నాలు ఫలించి, తిరిగి ఏలినవారు యధావిధిగా దేవపూజచేసుకొనే శుభకాలం రాకపోదు.

యౌగం : వసంతకా! నువ్వు వెళ్ళి మళ్ళా ఏలినవారి దర్శనంచేసి, నామాటలుగా మనవిచెయ్యి. మన మిన్నాళ్లూ చేస్తున్న సన్నాహం పూర్తిఅయిందనీ, రేవు ప్రయాణానికి సిద్ధంగావుండండనీ చెప్పు. నలగిరి అనే మదపుటేనుగుకు వెట్టి యెక్కించే సాధనాలన్నీ సిద్ధంచేసాము. అది స్నానం చేసే రేవులోనూ, దాణా తినేచోటా, అంతటా, ఉన్మాదహేతువులైన మంత్రౌ

మధప్రయోగాలు చేసివుంచాము. గాలి వాటున ధూపములు సిద్ధంగావున్నవి. రోషమెక్కించడానికి దాని కెదురుగా మత్తగజ మదపంకము వుంచాము. చేరువ నున్న పూరిగుడిసెకు నిప్పు ముట్టించగానే నలగిరికి భయమూ, కంపమూ పుట్టుతవి. వెంటనే దేవాలయాల్లో ఒక్కపెట్టున శంఖ ధ్వానములు చెలరేగగానే అది వశంతప్పి కట్లు తెంచుకొని చెలరేగుతుంది. అప్పుడు ప్రద్యోతుడు చేసేదిలేక ఏలినవారిని బ్రతి మాలుతాడు నలగిరిని పట్టవలసిం దని. ఏలినవారి కప్పుడు ఘోషవతితో గూడా బంధముక్తి కలుగుతుంది పిమ్మట నలగిరిని స్వాధీనంచేసికొని ఏలినవారు దాని నధి ష్ఠించారూ అంటే—

అరుల మనోజవమ్మునకు నందక,

కేసరిగర్జలకు భయం

కరమగు వింధ్యకానన మొకామొకి

దాటి, విభుండు వింతగాఁ

జెలి, నడుకాన, నింటను వసించుట
యబ్బెడు నొక్కనాటనే;
చెలిబహిరంగాదె మున్ను కరిచేత, గరిచేతనె
నేడు ముక్తి యౌరా!

రుమ : వసంతకా! ఏమిటి ఆలోచిస్తున్నావు?

వసం : మరేమీ లేదు; పాపం మీరింత శ్రమ పడుతున్నారే, ఇదంతా వ్యర్థంగదా అనుకొంటున్నాను.

ఉభయు: అంటే నీయూహయేమో తెలియ లేదు.

వసం : ముందు నాకు తెలియాలిగదా, మీకు తెలియడానికి.

యౌగం: మనయత్నమెవరిచేనంటావు చెడేది?

వసం : మీ కొకటి తలిస్తే వత్సరాజులుంగా కొకటి తలస్తున్నారు.

యౌగం : ఏమని తలస్తున్నారు?

వసం : వినండి మరి, చెపుతాను.

ఉభయులు : అవశ్యం.

వసం : మొన్న వెళ్లిపోయిన కాలాష్టమినాడు, రాజకన్య వాసవదత్తమ్మ, దాదినిమాత్రం వెంటదీసికొని, యక్షిణీపూజకని బయలు

చేరింది. జలదారులు పొంగి రాచబాట నరి కట్టడంవల్ల 'ఆమె పాలకీ కారాగృహ ద్వారం ముందునుంచి వెళ్లవలసివచ్చింది. ఆమె యింకా కన్యగనక ఆపాలకీకి ముసుగు లేదు.

యాగం : తరువాత ?

వసం : ఆనాడే ఏలినవారు, కారాగృహ పాలకుడైన శివకని అనుమతితో ద్వారంవెలుపలికి రావడం జరిగింది.

యాగం : పిమ్మట ?

వసం: సరిగా చెఱసాలగుమ్మందగ్గిరేబోయీలు పాలకీ నిలిపి బుజాలు మార్చుకోవడంలో ఏలినవా రాకన్యను తనివిదీర చూచారు.

యాగం : ఊఁ

వసం : ఇంకేముంది? కారాగార మల్లా ప్రమదవనమై పూరుకుంది. ఏలినవారు శృంగారలీల లారంభించారు.

యాగం : అయితే రాజకన్యపై అభిలాషకలిగిందంటావా, ప్రభువుకు ?

వసం : ఆఁ ఆఁ, అదే నేను మొత్తుకొంటున్నది. అనర్థాలెప్పుడూ ఒంటరిగా రావంటా రిదే.

యౌగం : సఖా! రుమణ్వంతా! మనసు రాయి చేసుకో. ఇక ఈ వేషాలతోనే ముసలితనం తప్పదు మనకు.

వసం : అంతటితో అయిందా, ఇంకా వినండి మఱి. యౌగంధరాయణుల ఆలోచన తమ కేమీ నచ్చలే దని చెప్ప మన్నారు. ప్రద్యోతులవారికి తగినశాస్తి చేయకుండా ఇక్కడినుంచి కదలిరారట ఏలినవారు. "మేము కామప్రధానుల మనుకొంటా రేమో, కాదు; అవమాన ప్రతీకారం కోరుతున్నామని చెప్పు" అన్నారు.

యౌగం : అయ్యో! శత్రువులు నవ్విపోతారని యైనా ఎంచవద్దా! ఇంతకంటె బైసిమాలిన ఆలోచన వుంటుందా, తనవారి కిది సంతాపకారణ మనికూడా తోచకపోవలెనా, కామలీల కింతచక్కని దేశకాలాలు దొరకినందుకు చెప్పాలి. ఓహోహా!

భూమిని జాపపై శయనము గాను,
దర్పము వీడఁ డింతయుఁ
గామునిబారి కగ్గమగుఁ గాళుల
మోగుచునుండ శృంఖలం;
క్షేమన నేమిపూ విభుని! నింతకు
నా కెజగానుబంటుఁ లే
"స్వామి! పరా" కటం చొదుగ
భానజుఁ మారకయుండనిచ్చునే.

విదూ: చూడండి. విశ్వాసంకొద్దీ మన సాయ
సత్తులా తంటాలుపడ్డాము. ఇకనైనా
ఆయనజోలి వదలి కొంపలకు చేరటం
మంచిది. పదండి.

యౌగం: ఆఁ ఆఁ! వసంతకుని మాటలేనా
యివి! ఎంతమాటన్నావు! అలా ఒక్క
నాటికీ వల్లపడదు.

కాలము గర్మము నెఱుఁగక
గోలయగుచు సంకటమునకుఁ, మదనునకుఁ
బాలై, మనపై బరువిడు
నేలిక నిట డించిపోదుమే! సఖులారా!

విదూ : అయితే యిలాగే ముదిసిపోదాం. కానివ్వండి.

యౌగం: అవును. అలా ముదుసళ్లం కావడమే శ్లాఘ్యం.

విదూ : నిజమేనంటి. లోకానికి మనదురవస్థ తెలిస్తేకదా, శ్లాఘించేది ?

యౌగం : మన యత్నమంతా ప్రభువుకోసం గాని లోకం మెప్పుకోసం కాదు.

విదూ : పోనీ, ఆ ప్రభువుకైనా తెలియాలి గదా మన కష్టం ?

యౌగం : క్రమంగా వారికే తెలుస్తుంది.

విదూ : ఇంకా యెప్పటికండి తెలిసేది ?

యౌగం : మనయత్నం ఫలించినప్పుడు.

విదూ : అయితే చెఱసాలనుంచి ప్రభువుతో పాటు రాణివాసంనుంచి రాజకన్యనుగూడా తరలించవలసివుంటుంది.

రుమ : బాగా చెప్పావు. తమ కెలాగూ తప్ప దీవనికూడా.

యౌగం : ఏమిటీ! ఇద్దఱినీకూడానా ? మంచిది ఇదిగో రెండో ప్రతిజ్ఞ.

అర్జునుండు సుభద్ర హరియించినట్లు
కరిరాజు కమలిని గైకొన్నయట్లు
అవనీశసుత చేడు హరియింపకున్నఁ
గానుసూ నేను యౌగంధరాయణుఁడ.
అంతేకాదు
ఆయతలోచన నారాజకన్య
చేఁడు గైకొనకున్న, చేఁడుగైకొన్న
కన్నెతో తేని నేఁ గైకొనకున్నఁ
గానుసూ నేను యౌగంధరాయణుడ.
(ఆలించి) ఏదో శబ్దంవలె వుంది. ఆలకించు.
విదూ: చూస్తాను. (వెళ్లివచ్చి) పగ లంతా పని
పాటులు చేసికొన్నప్రజలు గాలిపోసుకో
డానికి తండతండాలుగా బయలుదేరి వస్తు
న్నారు. మన మేమి చేద్దా మిప్పుడు ?
రుమ: ఈయగ్ని గృహానికి నాల్గువాకి ళ్లున్నవి.
తలొక వాకిట చీలిపోదాము.
యౌగం: వద్దువద్దు; మనం చీలకూడదు. పగ
మూకనే చీలగొట్టాలి. ఎవరిపనిమీద వా
రుండం డిక.
అందరు: చిత్తం (నిష్క్రమింతురు).

వెట్టి: అదిగో! మింగుతున్నాడు రాహువు. చంద్రుణ్ణి మింగుతున్నాడు. ఆగు, ఆగు. విడువు చందుౖణ్ణి విడువు. విడుస్తావా, నీముఖం పగలగొట్టి విడిపించమంటావా? ఇది గిదిగో! పొగరుబోతుగుఱ్ఱం పాఱి పోయివస్తున్నదీ చతుష్పథంలోకి. దీనిమీ దెక్కి బలిని భక్షిస్తాను. ఇరుగో, వస్తు న్నారు చిన్నదొరలు! రండయ్యా, చిన్న దొరలు! రండి. ఏదీ! నన్ను చావగొట్టండి మీరు, చూద్దాము. వద్దు బాబుల్లారా! వద్దు, నన్ను కొట్టకండి, ఏం? ఏమంటారు? నన్నేదైనా ఆట ఆడమం టున్నారా? ఓ, ఆలాగే, ఇదిగో! చూడండి దొరలు! ఏదీ మళ్లా కొట్టండి నన్ను, దుడ్డుకఱ్ఱతో; చూద్దాం. ఆఁ ఆఁ! ఎంతాశే! ఆగండి; కొట్టితిరా అంటే చంపేస్తాను.

(నిష్క్రమించును.)

తృతీయాంకం.

# ప్రతిజ్ఞాయౌగంధరాయణం

## చతుర్థాంకము

( భటుడు ప్రవేశించుచున్నాడు. )

భటు: ఏమైనాడో గాత్రసేవకు డెంత వెదకినా కనిపించడు. వాసవదత్తమ్మగారు జలక్రీడకు వెళ్లుతారట. భద్రవతిని తీసుకరమ్మని తొందరపెడుతున్నారు. ముందు మావటివాడు కనిపిస్తేనా, ఏనుగును తీసుకురావడానికి! ఇదుగో! మాబావ వస్తున్నాడు! పుష్పదంతకా! గాత్రసేవకుడు కనిపించాడా నీకు? ఏమన్నావూ? కల్లుపాకలో చేరి తాగుతున్నాడా? సరే. బావా! నువ్వు వెళ్ళు. (పరిక్రమించి)ఇదిగో, కల్లుపాక. ఒరేయి, గాత్రసేవకా! గాత్రసేవకా! (తెరలో) ఎవరా వీధిలో గాత్రసేవకా గాత్రసేవకా అంటూ.

భటు: అదుగో! చెడతాగి, ఒళ్లు తెలియక, తూలుతూ పేలుతూ వస్తున్నాడు. దాసా

ని పువ్వుల్లాగ కళ్లూ వీడూ. ఇప్పుడు వీడి యెదట బడగూడదు. (తప్పుకొనును.)

(యథానిర్దిష్టంగా గాత్రసేవకుడు ప్రవేశించును.)

గాత్రి: ఎవరయ్యా వీధిలో, గాత్రిసేవకా గాత్రసేవకా అంటూ. మొన్న కల్లుపాక లోంచి వస్తూంటే మా మామచూచి మండిపడ్డాడు. దాచడ మెలాగా? మిరియాలూ పుప్పూ వేసి నేతిలో పొగి చిన మాంసంముక్క నోట్లో, చేతిలో నేమో కల్లుముంత! మఱి దాగడ మెల్లా గంటా? కోడలుపిల్లేమో తాగి మీద బడుతుందాయె. అత్తలంజ కట్టుచ్చు కెంటబడుతుందాయె. ఎల్లా సచ్చేది?

ఒళ్ళు దెలకుండాను కల్లు తాగాలి
కల్లుతో ఒళ్లంత కలియ బులమాలి
కల్లులో మునగాలి ఒళ్లు దెలియాలి
చావాలి కల్లుతో, సొరగ మెళ్ళాలి
కల్లుముం తెప్పటికి చల్లగుండాలి

హీంహీంహీ! కల్లుసముద్రం పొర్లిపోతూంటే, మునిగి తేలక ఈ నాయాళ్ళు ఆలీపిల్లల

పోరుతో పడినస్తా రెందుకంటా? నాకు మాత్రం తెల్దూ మతి! యమలోకంలో నరక ముండదీ, లేందీ?

భటు: ఎంతసేపటినుంచిరా, వెదకడం నీకోస మని! వాసవదత్తమ్మగారు తానాలాడ బోతారట, భద్రవతి కనిపించదామె. నువ్వేమో, ఇక్కడ తాగి తందనాలాడు తుంటివి!

గాత్ర: హిహిహిహి! తెలుసుకున్నాడో్ర! ఇంకేముంది? అమ్మగారూ తాగింది, అయ్యగారూ తాగాడు. నేనూ తాగాను, నువ్వూ తాగావు, అంతా తాగారు.

భటు: అది సరేగాని, కోటలో ఏనుగుసాలలో పడివుండవలసినవాడవు, ఇక్కడ తందనా లాడుతున్నా వెందుకు?

గాత్ర: ఇక్కడ తందనాలాడుతా, అక్కడ తాగుతా. ఈముంతతో తాగుతా. మతి నువ్వేమంటావు? ఎందుకట్టా ఎగిరిపడతావు?

భటు: చాలుగాని, యీ తిక్కమాట లిక సరి పెట్టి, భద్రవతిని తోలుకురా యిప్పుడైనా.

గాత్రి: బుద్ధి బుద్ధి. పదవే బదరివతీ! పద. అరరే! అంకుశం తాకట్టులో వుందే, ఎల్లా మఱి?

భటు: పోనిలే, చెప్పినట్లల్లా వినే భదరివతి కంకుశ మెందుకుగాని త్వరగా తోలుకురా.

గాత్ర: ఔను. పదవే బద్రవతీ పద, అన్నట్టు తలగొలుసుకూడా తాకట్టులోవుందే!

భటు: పూలదండ చాలులే, తలగొలుసు లేక పోతేమానె. తోలుకురా జాగుసేయక.

గాత్ర: ఔను. పూలదండ చాలులే. పదవే బద్రవతీ పద. మఱి గంటో? గంటగూడా తాకట్టులోనే వుండే.

భటు: నీళ్లలో దిగే యేనుగుకు గంట యెందుకు అక్కర లేదుగాని, ఇంతకైనా తెమిలి తోలుకు రద్దూ.

గాత్ర: ఇదిగో వస్తున్నది. పదవే బదరివతీ మఱి కొరడాకూడా లేదే.

భటు: అబ్బా! కొరడా వద్దు, గొయిపలూ వద్దు. పదరా బాబూ!

గాత్రి: అయితే పదవే మఱి. అహ్యా!

భటు : మళ్ళా అయ్యో యేమిటి ?

గాత్ర : మతి- నేనూ-

భటు : ఊఁ ఏమిటి ! నువ్వు ?

గాత్ర : అదే- అదే- బద్ర-

భటు : ఏమి భద్రా !

గాత్ర : బద్రావతయ్యా.

భటు : ఊఁ భద్రావతి ?

గాత్ర : బద్రావతికూడా తాకట్టులోనే వుంది.

భటు : ఏమిటీ ! భద్రావతే తాకట్టా! నిన్ను అని ఏమి లాభం గాని, ముందు, ఈ గవ ళ్ళది మహారాజు ఏనుగు నెన్నిగుండెలతో కుదువెట్టుకుందో కనుక్కుంటాను.

గాత్ర: ఔను. కనుక్కోవలసిందే. వడ్డీఆశ మొదలు చెరుస్తుందని నేను చెప్పనే చెప్పాను.

భటు : (ఆలించి) ఏమి టా చప్పుడు !

గాత్ర : (పాలుజూచి) ఆ ఆ ! తెలిసింది. కల్లు పాక కూలదోసి బద్రావతి పారిపోయింది.

భటు : ఏ మన్నావు ! (ఆకసమున చెవియొగ్గి) వత్సరాజులుంగారు వాసవదత్తమ్మను తీసుకు వెళ్లిపోయినారా ?

గాత్రి: అవిఘ్నమస్తు. జయంకావాలి మా
ఏలినవారికి !

భటు: తాగరా, యిక తాగు. నీ చిత్త మొచ్చి
నట్లు తాగి దొర్లాడొచ్చు.

గాత్రి: ఎవరోయీ తాగింది? తాగిం
దెవరు, మత్తెక్కిన దెవరికి? యౌగంధ
రాయణుల చారులం, మే మెవరిపనులు
వారు చేస్తున్నా, మంతే. ఇదిగో! మా
స్నేహితు లందఱికీ సన్న చేస్తాను. అరుగో!
మావా ళ్ళంతా కూసంవిడిచిన త్రాచు
ల్లాగ యిటూ అటూ పరుగెత్తుతున్నారు.
ఓహో! అన్నలారా! వినండి, వినండి.

స్వామి యుప్పుబులుసు సాపడి యున్నాళ్ళ
గలను సేయ కిపుడు తొలఁగి రేని
ముందుగతులు దప్పుఁ, బుడిసెడు నీరమ్ము
పుట్టఁబోదు, నరకమును ధ్రువమ్ము.

ఆర్య యౌగంధరాయణు లేమైనారో?
అరుగో, అక్కడ!

తళతళలాడు ఖడ్గమును దక్షిణపాణిని,
బైడిడాలు డా
పలికరమందు బూని, మును వైచినచిన్నుల
నూడ్చి క్రొత్తవ
ల్వలు ధరియించి మేనఁ, దలపైఁ దెలిపుట్టము
జుట్టి, యాదలన్
జలి వెలుఁగింత దోఁపగ సచంచలమా
మొయిలట్లు వెల్గెడిన్.

ఓరోర! యుద్ధంతీవ్రంగా నేసాగింది. బళిబళీ!

తురగచయమ్ము రావుతులతో
నురుమాడుచు, మావటీలతోఁ
గరిఘట నుక్కడంచుచుఁ, దెగంబడి
మూకకుఁ జొచ్చి, లావునన్
దఱిమెడివేళ మత్తగజదంతహతిన్
క్షతబాహువై, అసిం
దొరఁగియు సుంతయున్ వెనుకద్రొక్కక
పోరెడు నార్యుఁ డల్లదే.

అయ్యయ్యో! పట్టుబడనేపడ్డారు, మాగంధ
రాయణులవారు. నేను వెళ్ళి ఆర్యులకు
బాసటవుతాను. (నిష్క్రమించును)

భటు: ఏమిటీ విపరీతం! ప్రాకారతోరణాలు తప్ప తక్కిన నగర మంతా కౌశాంబీ మయమై పోయినట్లున్నది. కానీ, వెంటనే వెళ్లి అమాత్యులకు విన్నవిస్తాను.

(నిష్క్రమించును.)

ఇది ప్రవేశకం.

(ఇరువురుపురుషులు ప్రవేశింతురు.)

ఉభ: తొలగండయ్యా! తొలగండి.

ప్రథ: అబ్బ! గొంతు బద్దలుచేసుకొన్నా వినిపించుకోకపోతే.

ద్వితీ: ఔనౌను. వాసవదత్తమ్మగారిని ఎత్తుకొనిపోయినారన్న అడావుడి మూలాన ఒక్కటేగోల. ఒక్కళ్లూ మాట చొరనివ్వరు. ఏమిటీ! తొలగడ మెందుకా? యౌగంధ రాయణులవారు పట్టుబడ్డారు. అందుకని. తెలిసిందా? ఎలా పట్టుపడ్డారా? వినండిమరి. ఒక్కటే రొదైపోయె. వినిపించుకుంటేనా! యౌగంధరాయణులవారు

కత్తి తానూ మనసేనల నెదుర్కొని నిలవ రించారు కొంతసేపు. ఇంతలో, విజయ సుందరమనే మనయేనుఁగున్నదే, దాని దంతం ఆయనచేతికి పొడుచుకోవడంలో కత్తికాస్తా జారిపోయింది. అప్పుడు పట్టు బడ్డారు. జారిపోయిన కత్తిదిగాని లోపం ఆయనది కాదు.

వసి : మీ రంతా హెచ్చరికతో వుండాలి. కౌశాంబి కౌశాంబంతా నగరంలో వచ్చి దిగినట్లుగా వుంది.

ఉభ : దిగండయ్యగారూ ! దిగండి.

(బద్ధబాహుఁడైన యౌగంధరాయణుఁడు ఫలకశయనంపై పండుకొని ప్రవేశించును.)

యౌగం : ఇదిగో ! దిగుతున్నాను.

చెఱవిడిపించితిఁ బతికిఁ
దొరకితిఁ బగతునకు శత్రుదోషమ్మున, భూ
వరుఁడు సుఖమున్నఁ జాలుఁ
దెఱియండె సుఖంతు నింక నిశ్చింతుఁడనై.

ఆలుబిడ్డలు లేనివానికి సన్యాసంకంటె సౌఖ్యమూ, కోరికలు సిద్ధించినపిమ్మట కలిగే విపత్తుకంటె రమణీయమూ వుండదు. సంచితధర్మలకు మరణ మొక లెక్కలోది కాదు.

వైరము భీతియుఁ బరిభవమ్ము సమమ్ముగ
నఃజ్జగించితిఁ
నేరుపుమీఱ నీతియు వినీతియు హేతియు
నాశ్రయించితిఁ
వైరుల పాభవమ్ము సఖవర్గపుదుర్యశముఁ
హరించితిఁ
కోరిక దీరె, జేని కొనఁగూడె జయమ్మిఁక
నేమికావలెఁ?

ఉభ: తొలగండయ్యలారా! తొలగండి.

యౌగం: ఎందు కలా తొలగదోలుతారు? చూడనివ్వండి. నన్ను చూడగోరేవారంతా యథేచ్ఛగా చూడవచ్చును.

శూరతగల్గు రాజపురుషుల్, సచివత్వము
నాససేయున
వ్వారలు, స్వామికై యిటు విపన్నుఁడనౌ
నన్నుఁజూడరందు! మీ

కోరిక నేటితోఁ గదా దగలొక్కని నూల్గాని
గాటమాటయా,
బాలెడు మూరెడై తఱుఁగఁ బాఱి నశించుటగా
తేట తెల్లమా.

ఉభ : తొలగండయ్యా. తొలగండి. మును
పెన్నడూ అయ్యగారి నెఱుగరా!

యౌగం : ఎఱుగకేమి? వెఱ్ఱి వేషంతో వీధుల
వెంట తిరిగిన నింద్య చరిత్రుఁ డని యెఱు
గరుగాని, నన్నెఱుగకపోవడ మేమీ!

భటుడు: (ప్రవేశించి) అయ్యగారూ! మీ కొక
శుభవార్త తెచ్చానండి. వత్సరాజులుం
గారు పట్టుబడ్డారండి.

యౌగం : పట్టేది. చెఱవిడిచి యీపాటి కడ
పులన్నీ దాటివుంటారు. నిమిషానికి యోజ
నం పోవున భద్రగజముపై నెక్కి పరుగు
నెవరు పట్టగలరు? నీకెవరు చెప్పారో
గాని వట్టిమాట.

భటు : నలగిరిపై తఱిమిపట్టారని విన్నానండి.

యౌగం : నలగిరి కంతటిశక్తి యున్నమాట
కాదనను గాని వత్సరాజు తప్పితే దానిని

నడిపేమొనగాడేడీ? ఏను గెంతటివైనా నా
నడిపేవానిలో వుంటుంది.

భటు: చిత్తం. అమాత్యులు తమరి "నాయుధా
గారం సురక్షితంగా వుంటుంది, అక్కడ
నుండ" మన్నారండి.

యౌగం: మీయమాత్యుల ఆజ్ఞ వింటే నవ్వు
వస్తున్నది. వత్సరాజనే అగ్నిని బంధించి
నన్నాభ్యా ఆదమఱచి నిద్రించిన మం
త్రులు, తీరా రత్నం పోయినమీదట
పట్టికరండంకోస మిప్పు డింతశ్రమ పడు
తున్నారు. పాపం.

భటు: దయచేయండి దే ఆయుధాగారం.
(పరిక్రమించును.)

(యౌగంధరాయణుఁ డంతు ప్రవేశించును.)

భటు: బంధనాలు విప్పవలసిందని అమాత్యులు
సెలవిచ్చారండి.

యౌగం: భరతరోహకులు నన్ను చూడగోరు
తున్నారుకాబోలు. మంచిది. నాకూ
చూడవలెననే వుంది వారిని. రోషంకొద్దీ
పలికే నాపరుషవాక్యాలు వింటూ, తన

మంత్రప్రయోగం పాటక, శాస్త్రాలెంత తిరుగవేసినా దారీ తెన్నూ కనిపించక, తన ప్రజ్ఞ పనికిరాకపోయిందిగదా అని ఖిన్నుడై ప్రతిక్రియ చేయలేక పడియున్న మల్లుని వలె తలవంచుకొని నిలుచుంటే-చూడవలె నని వుంది.

(భరతరోహకుడు ప్రవేశించును.)

భరత : ఏరీ! యౌగంధరాయణు లెక్కడ? వంచనచేసి కార్యం చక్కబెట్టుకొన్న మాకుస్వామికార్యంకొరకు విపత్పాలైన యీాయనను చూడడానికీ, పలకరించడానికీ మొగం చెల్లకుండావుంది. పట్టుబడిన్నీ రోషంచేత బుస్సుమని లేచే తాచువలె ఉంటా డీమహామంత్రి.

భటు: యౌగంధరాయణులీ ఆయుధాగారంలో తమ రాక కెదురుచూస్తున్నారు.

భరత : మంచిది. నీలగజప్రయోగంచేత మేము చేసిన వంచనాన్ని ఈయన ఎత్తి పొడుస్తాడుకాబోలు. కానీ.

భటు: (యౌగంధరాయణులతో) అయ్యగారు దయచేసారండి.

భరత: (సమీపించి) ఓహో యౌగంధరాయణులా?

యౌగం: ఆహా!

భటు: ఔరా, ఏమి యీ కంఠగాంభీర్యం! ఆ ఒక్కమాటతో నిండిపోయిం దీ ప్రదేశ మంతా.

భరత: (కూర్చుండి) ఇన్నాళ్లూ యౌగంధరాయణులని వినడమేగాని నేటివరకు దర్శన భాగ్యం లభించలేదు.

యౌగం: పితృద్రోహులను సంహరించి శాంతుడైన ద్రోణపుత్రునివలె ఇట్లా రక్తసిక్తాంగములతో వున్న నన్ను చూడడ మొక భాగ్యమా! చూడండి.

భరత: ఏనుగు మిషచే జరిగిన వంచనకు, పాపం, మిమ్ము నెందుకంతగా సంభావించు కొంటారు?

యౌగం: ఔను. వంచనంకాదామటి! మీ రెన్నడైనా వంచనమెరుగుదురుగనుకనా! మద్దులూ మల్లెపొదలూచాటుగా ఏనుగును

మాటి, చేసింది వంచనమని ఎవరంటారు?
సేవాయోగ్యుడైన నా ప్రభువును కటిక
నేలపై కట్టి పడవేసిందికూడా వంచనం
కాదు. మారాజు వీణావాదనంచేసి మద
గజాన్ని మచ్చిక చేసుకోవడమే మహా
వంచనం. ఏమంటారు! ఎంతకనచిన
మాటలివి? మహామంత్రులు ముందు
చూపిన దారినే మేమూ నడిచాము.

భటు: మహాసేనపుత్రిని వీణ నేర్పుమని అప్ప
గిస్తే మీరాజామెను అనగ్నిసాక్షికంగా
ఎత్తుకపోయిన చౌర్యానికేమంటారు?

యౌగం: ఎంతమాట! ఎంతమాట! భరత
వంశ సంజాతుడై వత్సరాజ్యముల నేలు
కొంటున్న మాప్రభువు, కళత్రానికేగాని,
ఇతర స్త్రీకి ఉపదేశ మెలా చేస్తారను
కొన్నారు మీరు! వివాహం అయిన
మీదటనే గురుత్వంచేసారు.

భర: ఇప్పటికీ వత్సరాజులుంగారిని మహాసేను
లెంతో మన్నిస్తున్నారుగదా?

యౌగం: మీరలా చెప్పకండి మఱి! నలగిరి వత్సరాజులుంగారి ఆజ్ఞలో నిలుస్తుందని ఎఱిగి చేసినమన్నన యిది, అంతే. ఆ కారణాన మా ప్రాణాలూ యశస్సు దక్కినవి.

భర: పోనీయుండి, నలగిరికోసమే వదిలితే తిరిగి బంధింపవచ్చునుగా!

యౌగం: ఔను, పాపం దయతలచి వదలిపెట్టినారు!

భర: సరేకాని, రాజనీతియంతా మీకు కొట్టినపిండిగదా, రణవిజితుడైన వైరిపట్ల శాస్త్రమేమి చెప్పుతున్నది?

యౌగం: వధించమంటున్నది.

భర వధార్హుడైన వత్సరాజును మే మెందుకు సత్కరించామంటారు.

యౌగం: అది విచారించియేకదా, మాయేలిక మహాసేనులను ప్రాణాలతో విడిచిపెట్టింది.

భర: ఏమీ ఆపనీ చేయగలమనుకొన్నారుగా!

యౌగం: ఇంకా సంశయమా! చేజిక్కినవాని నా సజ్జనుడు కాచిపుచ్చెనేగాని ఏనుగు నెక్కకముందే పతాకలు వ్రాలకుండునా?

భర: ఔనుగాని మహాసేనుల కపరాధంచేసిన మీకట కౌశాంబి నిలుస్తుందనేనా మీ యాలోచన?

యౌగం: ఆహాహా! నువ్వు వస్తున్నది మీ మాటలకు. మీ కన్నులయెదుటనే తప్పించుకొనిపోయిన వానికి తక్కినపను లొక లెక్కలోనివా? చెట్టునే పెల్లగించినవానికి కొమ్మలు నరకడ మెంతపని?

(కంచుకి ప్రవేశించి చెవిలో నేమో చెప్పును)

భర: నీవే చెప్పవచ్చును.

కంచు:

పగలు గలిగె మనకుఁ బలుకారణమ్ముల
నీవు సేసినట్టి యొగ్గుగలదె?
సుగుణరాశి వీ, వసూయ లేదింత నీ
పట్లఁ; గొనుము దీని బైడిపాత్ర.

అని సెలవిస్తున్నారు మహాసేనులు.

యౌగం: ఔరౌర!

చేతులార నేను జిచ్చుపెట్టిన గేహ
ములు, నమాత్యహృదయములును నట్టు
లొక్కవంక రగులుచుండఁగా, నీగౌర
వమ్ము సేత నాకు వధయొకాదె?

(తెరలో అయ్యో అయ్యో అని యేడుపులు)

భరత : ఏమది! డేగ రెక్కలలో జిక్కిన పిట్టల వలె రాజగృహంమీద నెవరా విలపించేది! పోయి వినిరా !

కంచు : చిత్తం (పోయి తిరిగివచ్చి) అంగారవతీ దేవి దుఃఖము పట్టలేక ప్రాసాదమునుంచి దూకి, శరీరం విడువబోతుంటే మహాసేనులు "ఎందుకలా విలపిస్తావు? నీ బిడ్డకు క్షత్రధర్మోచితమైన వివాహం జరిగే శుభసమయాన. వాసవదత్తా వత్సరాజుల యీ చిత్రపటాలకే వివాహం జరుపుకుందాము" అని ఓదార్చారు. అంతటు పురంధ్రిజనం సంతోషం పట్టలేక బాష్పములు జారగా వివాహమంగళం నెరవేరుస్తున్నది.

యౌగం : మహాసేను విధంగా సంబంధం కలుపుతున్నారుగనుక ఆ వైశిపాత్ర స్వీకరిస్తాను.

కంచు : (ఇస్తాడు)

భరత: యౌగంధరాయణా! మహాసేను లింకా నీకేమి ప్రియంచేయుగలరు ?

యౌగం: మహాసేనులు నాయెడ ప్రసన్నులైనా, రదియే పదివేలు.

భరతవాక్యం

ప్రబలుఁగాక రజమువాసి గోగణములు
వైరిచక్రముబ్బ్వాయుఁగాక
ధరణితలము నాల్గుచెఱఁగుల మారాజ
సింహు శాసనమ్ము చెల్లుఁగాత.

(అందఱు నిష్క్రమింతురు).

ఇది నాల్గవయంకము

ప్రతిజ్ఞానాటకము సమాప్తం.

